# స్వాధీనపతిక

సిరులు మించిన పసిడి బంగరు
జిలుగు దుప్పటి జారగా
చరణ పద్మము మీద దేహము
చంద్రకాంతులు దేరగా
మురువు జూపుచు వచ్చినావో
మోహనాకృతి మీరగా
గరుడవాహన! దనుజమర్దన
కందుకూరి జనార్దనా!



# విప్రలబ్ధ

ఆన బెట్టిన రాకపోతివి
అప్పుడే అటు మొన్నను
పూని బిలువగ వినకపోతివి
పొద్దు మాపై మొన్నను
నేను జూడగ గడిచిపోతివి
నీటు చేసుక నిన్నను
కాని తేరా! దనుజమర్దన
కందుకూరి జనార్దనా!



## విరహోత్కంఠిత

నిన్న రాతిరి చవికతోపుల
నీవు చెవి కూడుంటిరా!?
ఉన్న మార్గము లన్నియును
నేనొకతె చేతను వింటిరా
విన్న మాత్రము గాదురా
నిను వీధిలో గనుగొంటిరా
కన్నులారా, దనుజమర్దన
కందుకూరి జనార్దనా!



# అభిసారిక

దబ్బు వన్నియు తెలుసుకొంటిని
తప్పు బాసలు సేయకు
మబ్బు దేరెడి కన్నుగవతో
మాటిమాటికి డాయకు
ఉబ్బు చేసుక తత్తరంబున
నొడలిపై చెయి వేయకు
గబ్బితనమున, దనుజమర్దన
కందుకూరి జనార్దనా!



# ఖండిత నాయిక

చిత్తరంబుగ మొలక కెంపులు
    పెదవి నెవ్వతె నుంచెరా
సుత్తమైన మిటారి గుబ్బల
    గుమ్మ యెవ్వతె మెచ్చెరా
చిత్తగించక జీరువారను
    చెక్కు తెవ్వతె నొక్కెరా
కత్తిగోరుల, దనుజమర్దన
    కందుకూరి జనార్దనా!



# కలహాంతరిత

అండబాయక కూడియుంటిమి
ఆయెబోయెను నాటికి
మండి మండిపడంగ నేటికి ?
కదలు మెప్పటి చోటికి
ఉండరా నీ మాటలకు నే
నోర్వజాలను మాటికి
గండి దొంగవు! దనుజమర్దన
కందుకూరి జనార్దనా!



# ప్రోషిత పతిక

అలుకపున్నియు దీరగా
నా అండ కెప్పుడు వస్తివి?
పిలిచి నవరత్నాల సొమ్ములు
ప్రేమతో నెపుడిస్తివి?
వలచి వలపించియును గూరిమి
వదల కెప్పుడు మెస్తివి?
కలిసి వేడుక, దనుజమర్ధన
కందుకూరి జనార్దనా!



# వాసకసజ్జిక

జంట నేత్రము లంటి చూచితె
జాజిపూవులు పూసెరా
మింటి త్రోవను జూచుచుండగ
మేఘవర్ణము గప్పెరా
కంటితో నొక పండువెన్నెల
కాయుచున్నది యేమిరా?
కంటితేరా! దనుజమర్దన
కందుకూరి జనార్దనా!



# ప్రవత్స్యత పతిక

కొదవలన్నియు దీర్చుకొంటివి నా
గుణము తెరిగీ శయ్యను
అద నెరింగీ యేవితివి
విరవాది పూవుల శయ్యను
మదనకేళికి నీవె జాణవు
మారు నేమిటి చెయ్యను?
కదియ రారా, దనుజమర్దన
కందుకూరి జనార్దనా!



# మధ్యాధీర

చెల్లెబో! పసుపంటినది నీ
జిలుగు దుప్పటి విప్పరా
ముల్లు మోపగ సందు లేదుర
మోవి కెంపుయు గప్పరా
తెల్లవారినదాక యెక్కడ
తిరుగులాడితి? చెప్పరా
కల్లలాడక, దనుజమర్దన
కందుకూరి జనార్దనా!



